రాముడు రావణుని చంపి అయోధ్యలో పట్టాభిషిక్తుడై ధర్మబుద్ధితో ప్రజలను పరిపాలింప సాగాడు. ప్రజలు సంతుష్టులై, స్వధర్మ పరులై, పరస్పర ద్వేషములు మరచి సుఖించారు.

**రామో రామో రామ ఇతి,**
**ప్రజానా మభవన్ కథాః!**
**రామభూతం జగదభూత్**
**రామే రాజ్యం ప్రశాసతి!!**
**యు.కాం. 131స; 97శ్లో.**

--యు.కాం.131స; 97శ్లో.

జీవితంలో ఎవరికి ఏ సమస్య వచ్చినా రాముని ఆదర్శంగా తీసుకొని ప్రవర్తించటం వలన దాన్ని పరిష్కరించుకో గలిగారు. ఆ విధంగా జగమంతా రామ మయమై రామనామం మారు మ్రోగింది.

**రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।**
**రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥**
**చరితం రఘు నాథస్య శతకోటి ప్రవిస్తరం।**
**ఏకైక మక్షరం ప్రోక్తం, మహాపాతక నాశనమ్॥**



# “శ్రీరామ వాణి”

**డాక్టరు, తూములూరు శ్రీ దక్షిణామూర్తిశాస్త్రి**

**అయోధ్యా మధురా మాయా**
**కాశీ కాంచీ హ్యవంతికా**
**పురీ ద్వారావతీ చైవ**
**సప్తైతా మోక్ష దాయకాః**

ఏడు ముక్తి క్షేత్రాలలో మొట్ట మొదటనే అయోధ్య పేర్కొనబడింది. అఖండ భారతము నెడ భక్తి భావమును సముద్దీపింప జేయు అయోధ్య 'రామజన్మ భూమి'యై, పుణ్య కర్మలకు స్ఫూర్తినిచ్చు ధర్మభూమియై, జాతీయ భావమును పెంపొందించుటకు దోహదము చేయు సంస్కార స్థానమై విరాజిల్లుతోంది.

సరయూనదీ తీరములో ఉన్న 'అయోధ్య' కోసల దేశానికి ముఖ్య పట్టణం. మనువు చేత నిర్మితమైన ఆ నగరాన్ని రాజధానిగా చేసుకొని ఆ వంశంలో ఎందరో మహారాజులు ప్రజారంజకంగా పరిపాలన చేసారు. వారందరు ధర్మ, అర్థ, కామములను సమంగా ఉపాసించి తర్వాత పరమయోగి పదాన్ని అధిష్టించారు.

అందులో అజుని కుమారుడు దశరథ మహారాజు కాలంలో ఆ నగరం అన్ని విధాలా అభివృద్ధి చెందింది. అతనికి కౌసల్య, కైక, సుమిత్ర అనే వారు మువ్వురు భార్యలు. ఉత్కృష్టమైన సంస్కృతితో, ఉన్నతమైన నాగరికత వెల్లి విరసే విధంగా ధర్మాత్ముడైన ఆ రాజు పర్యవేక్షణలో సుప్రతిష్ఠమైన ఆ రాజ్యం ప్రజలందరి చేత వేనోళ్ళ కీర్తింపబడింది. సత్యవ్రతులైన మహాత్ములతో, యోగసిద్ధులైన మహర్షులతో కూడి అయోధ్య, దేవతలకు నిలయమైన అమరావతి వలె ప్రజాక్షేమంకరమై వర్ధిల్లింది.

సకల భోగ భాగ్యాలతో తులతూగే ఆ దశరథునికి సంతానం లేకపోవటం వలన ఆ కొరత తీరటం కోసం ఆ రాజు అశ్వమేధ యాగం చేయాలని సంకల్పించి ప్రారంభించాడు. దానికి అనుబంధంగా దేవతా ప్రీతికై పుత్రకామేష్టి కూడా

నిర్వర్తింపబడింది. వశిష్ఠాది మహర్షులతో బాటు ఋష్యశృంగ మహర్షి కూడా దగ్గర ఉండి ఆ యాగాన్ని చక్కగా నిర్వహించాడు.

దేవతల మనవి ననుసరించి రావణాది దుష్ట రాక్షస సంహారం కొరకు విష్ణువే నాలుగు విభాగాలుగా రూపం దాల్చి దశరథుని నలువురు తనయులు గాను అవతరించాడు. సంపూర్ణ మానవతా నిరూపణమే ఈ అవతారంలోని ప్రత్యేకత. కుల గురువు వశిష్టుడు వారికి 'రామలక్ష్మణ భరత శత్రఘ్నులు' అని నామకరణం చేయించాడు. క్రమంగా వారు పెరిగి పెద్ద వారై, విద్యా బుద్ధులు నేర్చుకొన్నారు. వారిలో పెద్దవాడు, గుణములచే గొప్పవాడు అని పేరెన్నికగన్న వాడు రాముడు.

మాధవుడే మానవుడై పుట్టి, మానవుడు మాధవుడుగా రూపొందడానికి తగిన ఆదర్శ జీవన విధానాన్ని ఆచరణం ద్వారా నిరూపించిన పురుషోత్తముడు రాముడు. అతని ధర్మపత్ని సీత. ఆమె లక్ష్మికి మరోరూపం "రామ రామ యో రయనం రామాయణమ్" ఆ సీతారాముల చరిత్రయే రామాయణంగా ప్రసిద్ధి కెక్కింది. వాల్మీకి, రామాయణానికి సీతామహచ్చరిత్రమనే మరొకపేరు కూడా పెట్టాడు.

ఉన్నతమైన జీవన ప్రమాణాలు, ఉదాత్తమైన నైతిక విలువలు గల ఉత్తమ మానవుడుగా రాముడు వ్యక్తికి ఆదర్శం. సీతారాములు దాంపత్యానికి ఆదర్శం. రామాయణం సమాజానికి ఆదర్శం. సనాతనమైన భారతీయ సంస్కృతికి ఈ ఆదర్శత్రయం ఆధారం.

మాతాపితృ భక్తిగల తనయుడుగా, భ్రాతృవాత్సల్యం గల సోదరుడుగా, మధుర ప్రణయ స్వరూపుడైన భర్తగా, ఆపదలో తోడుండే మిత్రుడుగా, ఆర్తత్రాణ పరాయణుడుగా, ఆశ్రిత రక్షకుడుగా, ప్రజాక్షేమాన్ని కాంక్షించి, లోక హితాన్ని సాధించిన ధర్మ ప్రభువుగా, రాముడు రామాయణంలో దర్శన మిస్తాడు. ఆతడు కార్య శూరుడు. కర్మయోగి. జ్ఞాన విజ్ఞానములకు నిధి. విద్యా వినయ వివేకములకు ఆతడు పరమావధి. సౌశీల్యము, సౌజన్యము ఆతని సొమ్ములు. ధర్మము ఆతని ప్రాణము.

ఆతని నోట పలికిన మాట సత్యానికి కోటగా, సంస్కారానికి పేటగా నిలుస్తుంది, నిత్యమై సత్యమై విలసిల్లుతుంది. ధర్మతేజంతో ప్రకాశించే ఆతని



గ్రహములు చేయవలసిన వారము మేమే. ధర్మ కామార్థ తత్త్వజ్ఞుడైన భరతుడు ఇప్పుడు రాజ్యమును పరిపాలించు చున్నాడు. మే మాతనిచే ధర్మ నియుక్తులమై ఈ భూమండలమున సంచరించు చున్నాము. సంక్లిష్ట కర్ముడవై, దుష్కర్మ మాచరించి, దండార్హుడవైన నిన్ను ఆ కారణముగా మేము నిగ్రహించాము.

సోదరుడు బ్రతికియుండగా ఆతని భార్యను, నిర్బంధించిన పాప కర్ముడవు నీవు. అట్టి వానికి నీకు మరణ దండనయే విధింప దగిన శిక్ష. రాజగు భరతుని ఆదేశమును పురస్కరించుకొని సాఘిక మర్యాద నుల్లంఘించి నడచు అధర్మ వర్తనుడవగు నిన్ను సంహరించి యున్నాను. ధర్మమునకుఁగట్టుబడి యున్నవారమే గాని మేము స్వతంత్రులము కాము."

ఇంక అన్ని విధముల వాలిని నిగ్రహించుట ధర్మమే అని చెప్పుచు రాముడు "తప్పు చేసిన మానవుడు రాజుచే శిక్షితుడై పుణ్యకర్ములు చేయు సత్పురుషులవలె స్వర్గమును పొందుచున్నాడు. పాపాత్ముడైన వానిని శిక్షింపకుండుటచే రాజునకు దోషము సంభవించును. అధర్మాచరణుడవైన నిన్ను శిక్షించుటచే నీకును నాకును ప్రయోజనము సిద్ధించినది" అనినాడు. శిష్టరక్షణ దుష్టశిక్షణ రెండును ప్రభు ధర్మములని ఇందు నిరూపింప బడినది.

ఇంకను, "లోకమున పరిపాలకులు తమ ప్రజలకు దుర్లభమైన ధర్మమును, శుభమైన జీవితమును ప్రసాదింపవలయు"నని రాముడు రాజధర్మమును ప్రకటించాడు.

**దుర్లభస్యచ ధర్మస్య జీవితస్య శుభస్యచ!**
**రాజానో వానర శ్రేష్ఠ! ప్రదాతారో న సంశయమ్!!**

--కి. కాం. 18; 42శ్లో



పదవి ప్రజాసేవగా తలంచెనేకాని, స్వార్థ ప్రయోజనమునకు విని యోగింప యోజింపలేదు. అట్టి నిర్మల హృదయుడు కావటం చేతనే రాముడు తాను అడువులకు వెళ్ళ వలసి వచ్చినా ఎట్టి వికారమును పొందలేదు. ఆతనికి పదవియే పరమార్థము కాదు.

రాముడు వనవాసానికి వెళ్ళేటప్పుడు పురప్రజలు కూడా ఆతనిని అనుసరించారు. వారిని ఏ విధంగానైనా అరణ్యవాస దుఃఖమునుండి తప్పింప వలెనని తలంచి రాముడు లక్ష్మణునితో "రాజపుత్రులు ప్రజలను కాపాడవలయునే కాని తమ నిమిత్తముగ వారిని దుఃఖముల పాలుచేయరాదని" చెప్పాడు, సరయూ నదీ తీరములో నిద్రించుచున్న ప్రజలకు తెలియకుండ రాత్రికి రాత్రి వారు సుదూర ప్రాంతాలకు వెళ్ళిపోయి, ప్రజలు తిరిగి అయోధ్యచేరి సుఖంగా ఉండాలని కోరుకొన్నాడు. ఇచట ప్రజా పరిరక్షణయే రాజధర్మంగా పేర్కొనబడింది.

చిత్రకూటంలో భరతుడు రాముని అయోధ్యకు రమ్మని వేడుకొనే సందర్భంలో జాబాలి "రాముడు తండ్రి మాట పాటించి వనవాసం చేయవలసిన అవసరం లేదని చెప్తూ అధర్మ వచనాలు పలికాడు. అది విని రాముడు సత్య ప్రశంసగావించి "లోకము పరిపాలకులైన రాజు లెటువంటి వారైతే పాలితులైన ప్రజలు అటువంటి వారే అవుతారు. కావున ధర్మం చెప్పగలిగిన ప్రభువులు భూతదయతో గూడిన సత్యమునే పాటించి తీరాలి" అని సనాతనమైన రాజ ధర్మమును ఉద్బోధించాడు. "యథారాజా తథాప్రజాః"॥

రాముడు చిత్రకూటంలో భరతుని గూర్చి చేసిన కుశల ప్రశ్నాదికము సర్వము, రాజ ధర్మమునే ప్రవచిస్తోంది. బహుజన హితము, బహుజన సుఖము దాని పరమ లక్ష్యము.

రాముడు ధర్మరక్షణలో భాగంగా చారిత్ర్య దూషకుడైన వాలిని సంహరించాడు. రామబాణ నిహతుడై, వికల హృదయుడైన వాలి రాముని పరిపరి విధముల దుర్భాషలాడాడు. ధర్మార్థ గుణ సంపన్నమైన మాటలతో రాముడతనికి సమాధానం చెప్పాడు.

"శైల, వన కాననములతో గూడిన ఈ భూమి యంతయూ మా ఇక్ష్వాకుల ఏలుబడిలోనిది. ఇందుగల మృగ, పక్షి, మనుష్య సంఘముల నిగ్రహాను



రూపం రత్న దీపమై అజ్ఞాన అంధకారాన్ని రూపుమాపి మానవ ప్రపంచానికి మార్గదర్శనం చేస్తుంది. ఆతని దివ్యకథా సంబంధమగు అమృత వాక్కులే ఈ "శ్రీరామవాణి"గా సంతరింప బడ్డాయి.

## మాతాపితృ భక్తి

"మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ, అతిథి దేవోభవ" అను (శ్రుతి)వేదవచనము మానవులకు జీవన విధానమును సూచించుచు ధర్మ మార్గమును బోధిస్తోంది. శ్రుతి విహితమగు ఆ అర్థమును ఆచరణము ద్వారా సాధ్యమని నిరూపించిన వాడు రాముడు.

దశరథుడు, శ్రేష్ఠగుణములు గల తన జ్యేష్ఠ తనయుడు రామునకు యౌవరాజ్య పట్టాభిషేకం చెయ్యాలని సంకల్పించాడు. అందుకు తగినట్లుగా ప్రజాభిప్రాయాన్ని కూడా సేకరించి, ఆ విషయం సభాముఖంగా ప్రకటించాడు. మరునాడే శుభ ముహూర్తం నిర్ణయింపబడింది. వెంటనే ఆ వార్త పట్టణమంతా చాటబడింది. ప్రజలందరిలో ఆనందోత్సాహాలు వెల్లి విరిశాయి. రాముడు సీతతో కలిసి, ఆ రాత్రి ఉపవాస వ్రతం పాటించాడు. మరునాటి ఉదయాన ఉత్సవం మరి కొంతసేపటిలో ప్రారంభం కావలసి ఉంది.

సుమంత్రుడు దశరథుని, సభకు విచ్చేయమని విన్నవించడానికి కైక మందిరానికి వచ్చాడు. అక్కడ రాజు సిద్ధంగా లేడు. అప్పుడు కైక ఆదేశం ప్రకారం సుమంత్రుడు రాముని, కైక మందిరానికి వెంటనే తోడ్కొని వెళ్ళాడు. రాముడు ముందుగా విషణ్ణ వదనుడైన దశరథునకు, తర్వాత కైకకు పాదాభివందనం చేశాడు. దశరథుడు రాముని జూచి 'రామా!' అని అంతలో అశ్రుపూరిత నయనాలతో దీన వదనుడై చూడటానికి, మాట్లాడటానికి కూడా శక్తి లేక నిర్విణ్ణుడై పడి ఉన్నాడు. అది చూచి రాముడు, కైకకు నమస్కరించి తండ్రి ప్రవర్తనకు, ఈ దుస్థితికి కారణమేమిటని ప్రశ్నించాడు. "తండ్రి మాట వినక, తండ్రిని సంతోష పెట్టక నేను క్షణ మాత్రమైనా జీవింపజాలనని" అన్నాడు. అందుకు కైక, మహారాజు తనకు పూర్వమిచ్చిన వరద్వయాన్ని ప్రస్తావించి, అది ఇప్పుడు నెరవేర్చటానికి నీయందు ఉండే ప్రీతితో తాను వెనుకాడు చున్నాడు. ఆ విషయంలోనే ఆతడిప్పుడిలా బాధ పడుచున్నాడని కారణం వివరించింది.

రాముడా మాటవిని కైకతో "మహారాజైన తండ్రి చెప్పినట్లైతే, నేను నిప్పులో నైనా దూకుతాను. ప్రియమైనా, అప్రియమైనా సరే అది నేను తప్పక ఆచరిస్తాను. ఆ విషయం ఏదో నీవైనా చెప్పు తల్లీ! ఇదే నేను ప్రతిజ్ఞ చేస్తున్నాను. ఈ రాముడు రెండు నాలుకలు కలవాడు కాదు" అని విన్నవించాడు. "రామోద్విర్నాభిభాషతే"

ఇట్లు అన్ని విధముల కట్టుదిట్టం చేసుకొని, కైక "రాముని వనవాసము, భరతుని పట్టాభిషేకము" అనే తన రెండు కోరికలు బయట పెట్టింది. ఆమె మాటలు విని రాముడు ఏమాత్రము వ్యథ చెందక "నేను ధనమునందలి ఆశచే ఈ లోకంలో ఉండటానికి ఇష్టపడటం లేదు. అమ్మా! కేవలం ధర్మ మార్గాన్ని అనుసరించే ఋషిగా నన్ను భావింపు" మని కోరాడు.

నావలన మీ కేమైనా ప్రియం జరిగే విధానం ఉంటే నా ప్రాణాలిచ్చి అయినా ఆ పని చేసి తీరుతాను. "తండ్రి మాట వినడం కంటే, తండ్రి సేవ చేయడం కంటే వేరుగా చేయదగిన ధర్మం లేదు.

తండ్రి స్వయంగా చెప్పనవసరము లేదు. నీ మాట పాటించియే నేను అరణ్యములకు పోవుచున్నాను. నా తల్లి కౌసల్యకు, నా భార్య సీతకు నచ్చ చెప్పి ఈరోజే అడవులకు ప్రయాణమవుతానని ప్రమాణం చేసి, అందుకు తగిన వ్యవధి ఇమ్మని కోరాడు. ఈ సందర్భంలో "పట్టాభిషిక్తుడైన భరతుని చేతను, పితృ సేవ చేయింపుమని" కైకను అభ్యర్థించాడు. ఇది రాముని పితృ భక్తిని తెలియ జేస్తుంది.

ఇంక, కైక వద్ద సెలవు గైకొని రాముడు తల్లి కౌసల్యమందిరానికివెళ్ళి తన వనవాస గమనమును గూర్చి వివరించాడు. పిడుగు లాంటి ఆ వార్త విని శోకాకులయైన ఆమెను ఓదారుస్తూ "బిడ్డలు తండ్రి మాట పాటించటం అవశ్య కర్తవ్య"మని, "అది అనూచానంగా వస్తున్న సంప్రదాయమ"ని చెప్పాడు. లోకములో ధర్మమే అధికము. సత్యము ధర్మమునందే ప్రతిష్టింపబడుచున్నది.

**ధర్మోహి పరమోలోకే,**
**ధర్మే సత్యం ప్రతిష్ఠితమ్,**
**ధర్మ సంశ్రిత మే తచ్చ,**
**పితుర్వచన ముత్తమమ్!!**

___ అయో. కాం. 21స; 40శ్లో.



## రాజధర్మం

సమాజ జీవితంలో మానవునకు అవసరమైన ఆహారం, వస్త్రం, గృహం, విద్య, వినోదం, రక్షణ మొదలైన విషయాలన్నీ ఏ ఒక్క వ్యక్తి గాని, లేక కుటుంబంగాని సమకూర్చుకోలేరు. అందులో ఒక్కొక్కరు ఒక్కొక్క రంగంలోకృషి చేయటం జరుగుతుంది. అందులో వారికి నిపుణత సిద్ధిస్తుంది. వారు పరస్పరం సహకరించుకొని, ప్రగతి సాధించటం జరుగుతుంది.

ఏకాలంలో అయినా, ఏ దేశంలో అయినా మేధావి వర్గం (విజ్ఞానం శాస్త్రవేత్తలు), ప్రభుత్వ పాలనా యంత్రాంగం (రక్షణ బాధ్యత), ధనికవర్గం (వ్యాపార సంబంధాలు), శ్రామిక వర్గం (కృషి, పశుపోషణ) అనే వర్గాలు, వారు నిర్వహించాల్సిన బాధ్యతలు ఉంటాయి. అన్ని విభాగాలు సంఘటనా భావంతో సామర్థ్యంతో కృషి చేసినప్పుడే ఆ సమాజం లేక ఆ దేశం సర్వతో ముఖాభివృద్ధి సాధిస్తుంది. చైతన్య స్రవంతిగా ముందుకు సాగిపోతుంది. ఆ విధి నిర్వహణలో పరస్పర సహకారమే తప్ప ఎక్కువ తక్కువలు అనేవి ఉండవు. గంగా ప్రవాహంలో ప్రతిబిందువు పవిత్రమే. అందరికి దాహం తీర్చుకోటానికి, స్నానం చెయ్యటానికి కూడా అది అర్హమే అని వేరే చెప్పాలా? ఒక మహా యంత్రంలో ఒక శీల లేకపోయినా, లేక జారిపడినా ఆ యంత్రం నడవదు. ఫలితం ఇవ్వదు. సమాజంలోని అన్ని పాత్రలు సమ ప్రాధాన్యం కలిగినవే. ఇందులో సందేహం లేదు. మధ్యలో ఏర్పడిన అడ్డుగోడలు కాలక్రమాన సమాజ వృక్షానికి పట్టిన చీ పీడలే. వాటిని మనం అధిగమించాలి.

భారతీయ సంస్కృతిలో ఈ పని విభాగం చాతుర్వర్ణ వ్యవస్థగా రూపొందింది. రామాయణం నాటికి దేశాన్ని రఘువంశ రాజులు పరిపాలించారు. ఆ క్రమంలో దశరథుడు ప్రజారంజకమైన పాలన కొనసాగించి, ప్రజాహితంకోరి, ప్రజలకు సన్నిహితుడైన రాముని యువరాజుగా నియమింప సంకల్పించాడు. పౌరులు, జానపదులైన ప్రజలందరు అందుకు హర్షం తెలియజేసారు.

పట్టాభిషేక వార్త రాముడు తన తల్లికి నివేదించాడు.

ఇచట రాముడు తనకు కలుగుబోవు రాజ్యలాభమును పితృాజ్ఞగా స్వీకరించి, శిరసావహించాడే కాని, స్వప్రయోజకత్వంగా భావించి గర్వంతో విఱ్ఱవీగలేదు.

తపస్వి జనులు తమ తపస్సులోని ఆరవ భాగము రక్షకులగు వారికిచ్చి వారి తేజోబలములను వృద్ధి పొందిస్తారు. కావున రాముడు మునిజన రక్షణము తనకు అవశ్యాచరణీయమని వక్కాణించాడు.



శూర్పణఖ చెప్పుడు మాటలు విని ఖరదూషణాదులు పదునాల్గువేల రాక్షసులు రామునిపై యుద్ధమునకు రాగా వారిని ఎదుర్కొని రాముడు ఖరునితో "ఈ జనస్థానమున గల రాక్షసులెల్లరు నాచే హతులు కాగా మునులు నిర్భయముగా సంచరించగల"రని పలికి ముని సమాజ శ్రేయస్సుకై, వనము నిష్కంటకము చేసి, తన ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నాడు.

రావణ సంహారానంతరము రాముని అభినందింప వచ్చిన ఇంద్రుడు రామునితో "నీకేమి కావలయునో కోరుకొమ్మన్నాడు".

అందుకు సమాధానంగా రాముడు "నాకేమీ అవసరము లేదని" చెప్పి, "తమ ప్రాణములు సహితము తృణప్రాయములుగా నెంచి, రాక్షసుల నెదిరించి, పోరాడి యుద్ధమున నాకై అసువులు కోల్పోయిన వానర వీరులను అమృతముచే పునరుజ్జీవింపజేసి, నా అభీష్టమును నెరవేర్చుమని" వేడుకొన్నాడు.

ఇంకను "వారున్నచోట కందమూల ఫలములు, విమలములైన జలములు సమృద్ధిగా లభించునట్లు వరము ప్రసాదించి, నిత్యము వారు ఆరోగ్యబల సంపదలతో వృద్ధి పొందునట్లు చూడవలసింది"గా కోరాడు. ధర్మానురక్తులు సహజీవనులైన వానరుల అభ్యుదయమే రాముని సంఘునిష్ఠ.



కౌసల్య "నేను తల్లిని కదా! నామాట సహితం పాటింపవలసిన ధర్మం నీకు లేదా?" అంటే రాముడు "అమ్మా! మరి నీకూ, నాకూ, సీతకు, లక్ష్మణునకు తల్లి సుమిత్రకు కూడా, ప్రభువైన తండ్రి మాట పాటించటమే ధర్మ"మని వక్కాణించాడు.

వనవాస వ్రతమును గూర్చి సీతతో చెప్తూ రాముడు, "తల్లిదండ్రుల మాట దాటి నేను జీవించుటకు కూడ ఇష్టపడుట లేదని, తనకది అవశ్యకరణీయమని వివరించి అతనికి గల మాతాపితృభక్తిని వెల్లడించాడు.

తల్లి, తండ్రి, గురువు ఉన్న చోటే, ముల్లోకములకెల్ల మిక్కిలి పవిత్రమని వర్ణించాడు. కావుననే తాను పితృ వాక్పాలనము చేయుచున్నాననియు స్పష్టపరిచాడు.

తర్వాత సీతతో, లక్ష్మణునితో గూడి రాముడు అరణ్యమునకు పోవుచు, తండ్రికి నమస్కరించుటకై, కైక మందిరానికి వచ్చాడు. అప్పుడు పుత్ర వ్యామోహితుడైన దశరథుడు రామునితో "నీవు అడవులకు పోవలదు. కైకచే మోసగింప బడిన నన్ను నిగ్రహించి, రాజ్యమేలు"మని పలికెను. అది విని రాముడు "పితృ సత్య వాక్య పరిపాలనమే తనయుడనైన నాకు ధర్మమని" చెప్పాడు. దశరథునకు అనృత దోషము కలుగకుండా ఉండేందుకే తాను అరణ్యమునకు పోవ నిశ్చయించు కొన్నానని, తక్కిన సుఖములన్నింటి కంటే పితృ సత్య నిష్ఠయే తనకు ముఖ్యమని రాముడు వక్కాణించాడు.



దశరథమరణానంతరము భరతుడు చిత్రకూటమునకు చేరి "అయోధ్యకు వచ్చి పట్టాభిషిక్తుడవగు" మని రాముని ప్రార్థించాడు. అప్పుడు రాముడు భరతునకు పుత్ర ధర్మమును ప్రబోధించి, "తండ్రిని సత్యవచనుని చేయటంలో తనతో పాటు భరతుని కూడ సహకరింప" మని అర్థించాడు. భరతుని పట్టాభిషేకము జరిగిన కాని తండ్రి కైకకు ఇచ్చిన మాట నెరవేరదని విపులంగా వివరించాడు.

కైక రామునకు అపకారం తలపెట్టిందనే రోషంతో భరతుడు ఆమెను నిందించాడు. రాముడు తన వనవాస క్లేశములకు కారణమైన కైకను ఏ రకంగాను నిందించలేదు. పైపెచ్చు తల్లి కైకేయి యుక్తముగనే మాట్లాడింది. తండ్రి దశరథుడు సుకృతమునే ఆచరించాడని వివరించాడు.

**యుక్త ముక్తంచ కైకేయ్యా,**
**పితామే సుకృతం కృతమ్**

అయో. కాం; 111స; 29శ్లో.

వనవాస సమయంలో ఒకసారి లక్ష్మణుడు, "ఇన్ని కష్టములకు మూలము ఆ కైక యొక్క క్రూర స్వభావమే కదా" అని ఆమెను నిందించాడు. రాముడావిధమగు మాతృదూషణ సహింపని వాడై లక్ష్మణుని వారించి "కైకను నిందించటం ఆపి వేసి, దశరథుని గూర్చి, భరతుని గూర్చి మాత్రమే చెప్పు"మని ఆదేశించాడు. వారి మంచి గుణములను కీర్తించమని ఉపదేశించాడు.

రావణ సంహారానంతరము తనను అభినందింప దేవతలతో గూడి స్వర్గము నుండి వచ్చిన తండ్రి దశరథునకు ప్రాంజలియై నమస్కరించి, రాముడు, "కైకను, భరతుని అనుగ్రహించి స్వీకరింపు" మని అర్థించి, ప్రసన్నుడైన తండ్రి చేత తల్లికి, తమ్మునకు శాప విముక్తి కలిగించాడు. ఉదార చరితుడైన రాముని మాతాపితృభక్తికి, భ్రాతృ వాత్సల్యమునకు, ధర్మనిరతికి ఇది నిదర్శనము.

## భ్రాతృ ప్రేమ

పురుషోత్తముడైన రామునకు లక్ష్మణుడు బహిః ప్రాణము. శరీరం కన్నా మిక్కిలి ఇష్టమైనవాడు. చివరకు లక్ష్మణుడు వెంట లేనిదే రాముడు భోజనం చెయ్యటం, నిద్ర పోవటం కూడ జరిగేది కాదు. అలాగే భరతుడు ప్రియతముడైన శత్రుఘ్నుని ప్రాణాధికంగా చూచుకొనేవాడు. వారి సోదరప్రేమ అట్టిది.



"తండ్రి ఆదేశం నిమిత్తంగా నేనిక్కడకు వచ్చినప్పటికి, తపోధనులైన మీకు ప్రయోజనం చేకూర్చుటయే నా ఈ వనవాసానికి సరియైన ఫలితం కాగలద"ని ప్రకటించాడు.

రాముని ప్రతిజ్ఞ విన్న సీత ఆతనితో "ఆర్యా! లోకంలో అసత్యమాడటం, పరదారాభిగమనం, అకారణ వైరం, అనేవి మూడు వ్యసనాలుగా పేర్కొనబడ్డాయి. అందులో మొదటి రెండు దోషములు నీయందు లేవు, ఇంక కలుగబోవు. రాక్షసులెన్నడు నీకెట్టి అపకారం చేయరైరి. ఈ రాక్షస సంహార రూపమైన అకారణ వైరమనే దోషం నీయందు కలగుతుందేమో అని నామనసు కలత చెందుతోంది. వనవాసానికి శస్త్ర ధారణకు, మునివృత్తికి క్షత్రియ ధర్మానికి పొంతన కుదరదు. అన్నీ తెలిసిన నీకు బోధించటానికి నేనంత దాన్ని, నీవు నాయందు చూపుచున్న స్నేహంతోను, ఆదరభావంతోను, చొరవ తీసుకొని ధర్మ స్వరూపాన్ని గుర్తు చేస్తున్నానని పలికింది.

**"స్నేహాశ్చబహుమానాశ్చ స్మారయే నతు శిక్షయే"**

ధర్మజ్ఞురాలైన జనకసుతకు సమాధానంగా రాముడు "పరిపాలనా బాధ్యతగల క్షత్రియుడు ధనుస్సు చేపట్టి ఆపదలు లేకుండా సమాజాన్ని కాపాడాలి-అన్నది నీవు అంగీకరించే సత్యమే కదా!

ఈ దండకారణ్యంలో ధర్మసంశ్రిత వ్రతులైన మునులు, రాక్షస కృత్యములకు వెఱచి, ఆర్తులై నన్ను శరణువేడగా, రక్షించుట నా కర్తవ్యమని ఎంచి, నిర్ణయించుకొని రాక్షసులను చంపటానికి నేను ప్రతిజ్ఞ చేశాను" అన్నాడు.

కష్టమో నష్టమో "మనదాకా రాలేదు కదా! మనకెందుకులే" అనే ఉపేక్షాభావం విడిచి పెట్టి, సమాజ ధర్మాన్ని రక్షించటానికి ప్రతి ఒక్కరు తమ శక్తియుక్తులు వినియోగించటం సాంఘిక బాధ్యతయని రాముడు కర్తవ్యాన్ని నిర్ణయించాడు.

తాను నివసించే సమాజంలోని సమస్యలను సహృదయంతో అవగాహన చేసుకొని పరిష్కారానికి పాటుపడటం అవసరమని ఇచట రాముని నడవడి మనకు బోధిస్తోంది.

మునిజన సమూహం సంతోషించేలా సిద్ధాశ్రమంలో యాగ సంరక్షణ చేసి, జనకుని యజ్ఞం సందర్శించి, శివధనుర్భంగం కావించి, సీతను పరిణయ మాడి, పరశురామ గర్వాపహరణం ద్వారా క్షత్రియ సమాజంలోని భయ భ్రాంతులను తుదముట్టించి, అయోధ్యకు తిరిగి వచ్చి ధర్మాత్ముడైన రాముడు, తండ్రి అనుమతితో ప్రజలకు సంబంధించిన ప్రజాహిత కార్యక్రమములు నిర్వహిస్తూ ప్రజాభిమానానికి పాత్రుడయ్యాడు.

రాముడు ప్రజలలో ఎవరికైనా కష్టం వస్తే సానుభూతితో వారి కష్టంలో పాలుపంచుకొనేవాడు. సుఖం కలిగినప్పుడు తండ్రిలా ఆనందించేవాడు.

**వ్యసనేషుమనుష్యాణాంభృశంభవతి దుఃఖితః।**
**ఉత్సవేషుచసర్వేషు పితేవపరితుష్యతి॥**

ప్రజలు తమకు హితుడు, సన్నిహితుడు అయిన ఆ రాముని చూడలేక పోయినా, ఆతనిచే చూడబడలేక పోయినా వారు లోకంచే నిందింపబడటమే కాక, చివరకు తమను తామే అసహ్యహించు కొనేవారు.

సంఘమునకు పునాది కుటుంబం. కుటుంబమునందు విధి నిర్వహణ చక్కగా చేయగలవాడు సంఘమునకు మేలు చేయగలవాడే అవుతాడు.

రాముడు కుటుంబములో వచ్చిన సమస్యలను త్యాగం ద్వారా, సహనం ద్వారా చక్కజేసి పితృ సత్య వాక్పాలనమునకై అడవులకు వెళ్ళాడు.

దండకారణ్యములో మునులంతా ఒకచోట జేరి తమ "తపోయజ్ఞ వ్రతాదులకు భంగం వాటిల్లచేసి, ధ్యాన సమాధులలో మునిగి ఉన్న సాధుముని జన సమూహాన్ని చంపి, తినే దుష్ట రాక్షస వినాశనం చేసి, మమ్ములను కాపాడ" మని రక్షకుడైన రాముని ప్రార్థించారు. అయోధ్యలో ఉన్నా, అడవిలో ఉన్నా మాకు నీవే రాజువని చెప్పి ఆతని కర్తవ్యాన్ని గుర్తుచేశారు.

**నగరస్థోహివనస్థోహిత్వం నో రాజా జనేశ్వరః।**

చిత్రకూటంలో జరిగిన నిర్ణయం ప్రకారం భరతుడు రాష్ట్ర ప్రజలకు పాలకుడు కాగా, రాముడు అరణ్య వాసులకు రక్షకుడుగా పేర్కొనబడ్డాడు. అందువల్ల "అక్కడ జరిగే అన్యాయాన్ని ఎదిర్చి, అధర్మాన్ని ఆచరించే రాక్షసులను వధించి తీరుతానని" రాముడు ప్రతిజ్ఞ చేశాడు.



పట్టాభిషేకము జరుగుతుందని తెలియగానే రాముడు ఆ సంగతి లక్ష్మణునికి చెప్పి ఆ ఆనందములో పాలు పంచి యిచ్చాడు. "అధికార సంపదలతో పాటు, తన జీవితము సహితము సోదరుల అభ్యుదయానికే ఉపయోగపడాలని కోరుకుంటున్నాని చెప్పి, తనతో గూడి రాజ్య సుఖములు అనుభవింపు"మని లక్ష్మణునితో అన్నాడు.

గుణానురక్తుడై, వనవాసానికి, తన వెంట వస్తానంటున్న లక్ష్మణుని, వారిస్తూ రాముడు "నీవు మాతా పితృ సేవా పరాయణుడవై అయోధ్యలోనే ఉండమ"ని కోరాడు. స్నేహ వాత్సల్య పరిపూర్ణుడై రాముడు తమ్ముని మనసార అభినందించాడు.

రాముడు సీతా లక్ష్మణ సహితుడై అరణ్యానికి బయలుదేరే సందర్భములో అయోధ్యాపుర వాసులైన ప్రజలు కూడా అతనిని అనుసరించారు. అట్టి యెడ రాముడు ఆ పౌరులను వారించి, వారితో "మీరు నాయందు ఏ విధమైన అభిమానము కలిగియున్నారో భరతుని యందు కూడా అట్టి అభిమానాన్నే ప్రదర్శించి నా ప్రీతి కొరకు ప్రవర్తించుడని కోరి, "కైకేయ్యానందవర్ధనుడగు భరతుడు, కల్యాణ చారిత్రుడు కావున, అతడును ప్రజా సంబంధమైన ప్రియహిత కార్యక్రమాలు నిర్వహించునని చెప్పి, భరత సోదరుని సుగుణములను ప్రశంసించాడు.



దశరథుడు మరణించిన తర్వాత, "అయోధ్య జేరి పట్టాభిషిక్తుడవై ప్రజల పాలింపుమని రాముని అర్థించటానికి భరతుడు సపరివారముగా చిత్రకూటానికి వచ్చాడు. అరణ్యంలో ఆతని సైన్య కలకలము విని కలతపడి లక్ష్మణుడు

ఉన్నతమైన ఒక సాలవృక్షాన్ని అధిరోహించి, చూచి, అది అయోధ్యా సేనా వాహినిగా గుర్తించాడు. "భరతుడు తనకు లభించిన రాజ్య సుఖములను శాశ్వతం చేసుకోటానికై మనలను వధించి అడ్డు తొలగించుకొనేందుకు చతురంగ బలసమేతుడై వస్తున్నాడనే భావన వెలిబుచ్చి, ద్రోహబుద్ధి గల ఆ భరతుని క్రూరంగా వధించి" తీరుతానన్నాడు. క్రోధంతో ఊగిపోతున్న ఆ లక్ష్మణుని మాటలువిని రాముడు, "పితృ వాక్య పరిపాలనమునకై అడువులకు చేరిన మనల్ని కేవలం అభిమానంతో చూడటానికని వచ్చిన భరతుని చంపి సంపాదించిన రాజ్యము నాకెందుక"ని పల్కి "సోదరులను కాదని అధార్మికంగా పొందే రాజ్యాధికారమే కాదు, ఇంద్రపదవి అయినా నేనిష్టపడనని"చెప్పి, "నేను ఏ సుఖమైనా సోదరులైన మీ కొరకు మాత్రమే కోరుకుంటున్నా"నని ఆయుధం పట్టుకొని తన ప్రతిజ్ఞను తెలియచేశాడు.

"లక్ష్మణా! భరతుని శంకించి నిష్ఠురోక్తులాడకుము. ఆతని గూర్చి నీవు అప్రియము పల్కినచో నన్ను గూర్చి పలికినట్లే భావింపు"మని చెప్పి సోదరుని యెడ సమతను, మమతను ప్రకటించాడు రాముడు.

**నతే నిష్ఠురం వాచ్యో భరతో**
**నా ప్రియం వదః।**
**అహంహ్య ప్రియముక్తస్యాం**
**భరతస్యాప్రియేకృతే॥**

అయో. కాం. 97స; 15 శ్లో

నిజానికి లక్ష్మణుడు అయోధ్యలో తండ్రి పైనను, చిత్రకూటంలో భరతుని పైనను మండిపడటానికి ముఖ్యంగా వారు రామునికి అపకారం తలపెట్టారన్నదే కారణం. అంతకు మించి వేరేమీ కాదు. రాముని మాటల వలన ఆ అపోహ తొలగటం చేత ఇతరత్రా అతడు వారిపై భక్తిని, అభిమానాన్ని ప్రకటించడం గమనించగలం.

పంచవటియందు అనువైన పర్ణశాల నిర్మించి, ప్రీతితో సేవలందించుచున్న లక్ష్మణుని జూచి రాముడు సంతృప్తిజెంది, స్నేహ పూర్వకంగా కౌగిలించుకొని "నాయనా లక్ష్మణా! భావజ్ఞుడవయిన నీవు ప్రియహిత కృత్యముల ద్వారా,



## సంఘనిష్ఠ

మానవుడు సంఘజీవి. ప్రపంచంలో ఎవరు ఎంతటి గొప్పవారైనా ఆ గొప్పతనానికి కారణమైన ఒక సమాజం అతని వెనుక ఉండి తీరుతుంది. వ్యక్తి 'తాను, తన కుటుంబము' అనే పరిమితమైన పరిధిదాటి తన చుట్టూ ఉన్న సమాజం వైపు చూపు ప్రసరింప జేస్తే, తానేమిటో, తనకు ఆ సమాజం చేసిన మేలేమిటో, ఆ సమాజం పట్ల తన బాధ్యత ఏమిటో తెలుస్తుంది. ఆ విషయం గుర్తించిన నాడు కర్తవ్యమేమిటో స్ఫురిస్తుంది. దాంతో అతడు కుటుంబములోను, సంఘంలోను కూడ శక్తి వంచన లేకుండా కృషి చేయగలుగుతాడు. ఆ విధంగా వ్యష్టి, సమిష్టగా రూపొందిన భావంతో అనుబంధం పెంచుకొని, నూతనోత్సాహం సంతరించుకొని, సమాజానికి సేవలందించి తన సామర్థ్యాన్ని నిరూపించు కొంటాడు. అప్పుడతనికి సమాజమంతా ఒకే కుటుంబముగా భాసిస్తుంది.

ఎందరో మహానుభావులు ఈ వసుధైక కుటుంబ భావంతో ప్రవర్తించి మానవ సమాజానికి ఔన్నత్యాన్ని కల్గించారు.

మొదటగా రాముడు తండ్రిచే విశ్వామిత్ర యాగ రక్షణకు నియోగింపబడి సిద్ధాశ్రమానికి బయలు దేరాడు. తమ్ముడు లక్ష్మణుడు కూడా ఆతనిని అనుసరించాడు. వారిరువురు విశ్వామిత్ర మహర్షి దగ్గర అనేక శస్త్రాస్త్ర విద్యలు, బలాతిబల విద్యలు అపూర్వమైన లౌకికా లౌకిక విజ్ఞాన సంపద పొందగలిగారు. గురు శుశ్రూషలోగల ప్రయోజనాన్ని నిరూపించాడు.

మార్గమధ్యంలో అధర్మ రూపిణి తాటక ఎదురుపడింది. వారితో యుద్ధానికి తలపడింది. ఆమె రాక్షసత్వంతో చేసే సంఘ విద్రోహక చర్యలు తెలిసికొని రాముడు ప్రజారక్షణ కోసమై, దేశ సౌభాగ్యాన్ని కాంక్షించి, అందుకు తన వంతు బాధ్యతగా తాటకను సంహరించాడు. తండ్రి యానతి, విశ్వామిత్రుని ప్రోత్సాహము దానికి తోడయినాయి.

**గో బ్రాహ్మణహితార్థాయ**
**దేశ స్యాస్య సుఖాయచ!**
**తవచైవాఽ ప్రమేయస్య**
**వచనం కర్తుముద్యతః**

-- బా. కాం. 26స; 5శ్లో.

మిక్కిలి గౌరవం లభించింది. ఇకనుండి మనకు కలుగు సుఖ దుఃఖములు రెండును మన ఇరువురకు సమానమని తన సుహృద్భావాన్ని ప్రకటించాడు.

ఆ తర్వాత, వాలి వలన తనకు కలిగిన భయం వివరించి, సుగ్రీవుడు రాముని అభయమును ప్రసాదింపుమని వేడుకొన్నాడు. అదివిన్న ధర్మజ్ఞుడు, ధర్మ వత్సలుడు అయిన రాముడు "ఉపకారం చేసేవాడు మిత్రుడు. అపకారం చేసేవాడు శత్రువు. కావున; నే నెలాగైనా దుర్వృత్తుడై నీ భార్యను అపహరించిన వాలిని సంహరిస్తాన"ని ప్రతిజ్ఞచేసి ఆతనికి ధైర్యమును కల్గించాడు.

సుగ్రీవుడు, విమానం పై నుండి సీత పూర్వమచట విడిచిన నగలమూట చూపించాడు. అవి చూసి శోకపరితప్తుడైన రాముని ఊరడించి, సుగ్రీవుడు "సీతాపహారియైన రావణునిచంపి సీతనప్పగించి నీకు ప్రత్యుపకారం చేయగలన"ని సాంత్వనములు పలికాడు. "నీ ఓదార్పు, మాటలతో నాహృదయ మిప్పుడు కుదుటపడింది" అన్నాడు రాముడు.

"అభ్యుదయం కలుగునప్పుడు అందరు మిత్రులే అవుతారు. కాని కష్టకాలంలో సహాయమొనరించే వాడే నిజమైన స్నేహితుడు". రాముడా విషయమే చెప్పి సుగ్రీవుని మైత్రి భావమును ప్రశంసించాడు.

రావణుని సంహరించి, సీతను పరిగ్రహించి, అయోధ్యకు ప్రయాణమై పోవుచు, తన కన్నివిధాలా సహకరించిన సుగ్రీవుని, తక్కిన వానర వీరులను ఉద్దేశించి "మీరంతా మిత్రకార్యమును చక్కగా నిర్వర్తించార"ని వారిని కృతజ్ఞతా పూర్వకంగా అభినందించాడు.

సపరివారుడైన సుగ్రీవుని పుష్పక విమానంపై అయోధ్యకు తీసుకొని వచ్చి పట్టాభిషేక మహోత్సవంలో సముచిత స్థానాన్ని కల్పించి, అనర్ఘములగు వస్త్రమాల్యానులేపనములిచ్చి సంభావించాడు.

మంచి మిత్రుని పొందటం గొప్ప అదృష్టం. అది అందరికి లభించటం అరుదు. అందుకే రాముడు ఒకప్పుడు సుగ్రీవునితో "లోకంలో నీవంటి మిత్రుడెవ్వడును లభింపడని" చెప్పాడు. లోకవిశిష్టమైన స్నేహధర్మంలో సాధ్యంకానిదేదీ లేదు. ఈ స్నేహ భూమికతోనే ఇచ్చి, పుచ్చుకొనే సంప్రదాయం పుట్టి పెరిగింది. పరస్పర సహకారమన్నది జీవులలో వృద్ధిపొందింది.



మహాత్ముడు, వాత్సల్య పూరితుడయిన తండ్రిని మరపించుచున్నావని", ఆతని ఉపకార బుద్ధిని కృతజ్ఞతా భావంతో అభినందించాడు. "మనం అన్నదమ్ములం నలువురం కలిసి ఉండే మంచి రోజులు తిరిగి ఎప్పుడొస్తాయో?"అని సంఘటనా భావం కలిగిన రాముడు ఆ శుభ ముహూర్తాన్ని త్రికరణ శుద్ధిగా కోరుకున్నాడు. కాలం కలిసివచ్చి, నలువురు ఒకచోట చేరినప్పుడు (అయోధ్యలో) ఆ ప్రేమామృతాన్ని అనుభవించి, వారికి ప్రీతితో పంచిపెట్టాడు.

లంకలో రామ రావణ యుద్ధం ప్రారంభమయ్యింది. ఇంద్రజిత్తు నాగపాశం చేత రామ లక్ష్మణులను బంధించాడు. దాంతో వారు మూర్ఛపోయారు. అందులో రాముడు, ముందుగా తెలివి పొంది, ఇంకను విగతచేతనుడై పడి ఉన్న లక్ష్మణుని చూచి దుఃఖిస్తూ, "సీత వంటి భార్య భూలోకంలో ఎక్కడైనా వెతికితే లభించవచ్చు నేమో, లక్ష్మణునితో సమానమైన సోదరుడు యుద్ధ విద్యలలో నేర్పుగలవాడైన సచివుడు, మాత్రము లభింపడం"టూ, సోదరుని ఆ దురవస్థను చూచి విచారపడ్డాడు.

నేను అడవులకు వచ్చేటప్పుడు మహా తేజశ్శాలియైన లక్ష్మణుడేతీరుగా నన్ను అనుసరించి వచ్చాడో ఆ విధంగానే నేను ఇప్పుడీ లక్ష్మణుని వెంట యమ సదనానికి పోతాన"ని నిర్ణయించుకొని, "ఏ దేశం వెళ్ళినా భార్యా, బంధువులు లభిస్తారు. కానీ సహోదరుడెక్కడా దొరకద"ని చెప్పి, సంజీవినిచే లక్ష్మణుడు పునరుజ్జీవితుడయ్యే వరకు ఆ విషాదాన్ని అనుభవించాడు.

**దేశే దేశే కళత్రాణి**
**దేశే దేశేచ బాంధవాః ।**
**తం తు దేశం నపశ్యామి**
**యత్ర భ్రాతా సహోదరః ॥**

యు. కాం. 101స; 15శ్లో

**భరతుని సౌశీల్యమును కీర్తించుచు రాముడు సుగ్రీవునితో**
**"నసర్వే భ్రాతరస్తాత భవంతి భరతో పమాః"**

(యు. కాం. 18స; 15శ్లో)

లోకమున భరతుని వంటి సోదరుడు లభింపబడని వక్కాణించాడు. రావణ సంహారానంతరం రాముడు అయోధ్య చేరి ప్రజా పరిపాలనా బాధ్యతలను స్వీకరించి భరతునకు యౌవరాజ్య పట్టాభిషేకం చేశాడు. శత్రుఘ్నుని లవణాసుర సంహారముకై నియోగించి, ప్రజాక్షేమమును కల్పించి, ఆ రాజ్యమునకు శత్రుఘ్నుని రాజుగా చేశాడు.

### ధర్మనిరతి

**"రామోవిగ్రహవ్యాధర్మః"**

ధర్మ విగ్రహుడైన రాముడు, ధర్మ స్వరూపమును ఉగ్గడించి, లోకంలో దాని ప్రాధాన్యం గూర్చి ఈ విధంగా వివరించాడు. "కేవలం ఆర్థిక దృష్టితో మెలిగేవారు సమాజంలో ద్వేషింపబడతారు. కామభావనతో ప్రవర్తించేవారు నిందింపబడతారు. అందువల్ల ధర్మబద్ధములైన అర్థకామములు మాత్రమే అనుభవించాలి. మానవుని వివేకం ధర్మాన్ని అనుసరించి ప్రవర్తించటంలో వినియోగ పడాలి. అది వ్యక్తికి, సమాజానికి మేలు చేకూరుస్తుంది".

రాముడు, తల్లిని ఆశీర్వాద పూర్వకంగా వనవాసానికి అనుమతింపుమని ఆమెను కోరినప్పుడు ఆ వీరమాత కౌసల్య కుమారుని ధార్మిక బుద్ధిని మెచ్చుకొని "నాయనా! నీవు ధైర్యంతో నియమంగా అనుసరిస్తున్న ధర్మమే నిన్ను కాపాడుతుందని" సెలవిచ్చి పంపించింది.

**యం పాలయసి ధర్మం త్వం**
**ధృత్యాచ నియమేనచ ।**
**సవై రాఘవ శార్దూల**
**ధర్మస్త్వా మభిరక్షతు ॥**

అయో. కాం. 25స; 3శ్లో

చిత్రకూటానికి వచ్చిన భరతునకు రాముడు "నావలెనే నీవును మాతాపితృ వాక్యము ననుసరించి పట్టాభిషిక్తుడవై ప్రజల పాలించుట కర్తవ్యము"ని బోధించాడు.

పంచవటి యందు శూర్పణఖ ప్రశ్నింపగా "ధర్మానురక్తియే తన వనవాసమునకు కారణమని" రాముడు సమాధానం చెప్పాడు.



రావణ సంహారం చేసి అయోధ్యకు తిరిగివస్తూ రాముడు భరద్వాజాశ్రమంలో ఆగి, హనుమంతుని ద్వారా గుహునకు తన క్షేమవార్త తెలిపి సంతోషాన్ని కలుగుజేశాడు. 'సఖః' అన్న పదానికి సమ సుఖ దుఃఖానుభవంగల మిత్రుడని అర్థం. రాముడు గుహుని ఆ విధమైన 'ఆత్మ సమసఖునిగా' సంభావించాడు.

పంచవటిలో సీతాపహరణం జరిగిన తర్వాత, రామ లక్ష్మణులు ఆమెను వెతుకుచు, కబంధుని సూచననుసరించి సుగ్రీవుని మైత్రికోరి ఋష్యమూక పర్వత ప్రాంతానికి చేరారు. సుగ్రీవుని అనుమతితో ఆతని సచివుడైన హనుమంతుడు 'వారెవ్వరైనది' విచారించటానికి వచ్చి, వారిని చక్కగా పలుకరించాడు. అప్పుడు "మధురమైన వాక్యములతో స్నేహపూర్వకంగా ఆతనికి సమాధానం చెప్పుమ"ని రాముడు లక్ష్మణుని ఆదేశించాడు.

**తమభ్య భాష సౌమిత్రే**
**సుగ్రీవ సచివం కపిమ్ ।**
**వాక్యజ్ఞం మధురైర్వాక్యైః**
**స్నేహయుక్త మరిందమ ॥**

-- కి. కాం, 3స; 27శ్లో



రామ సుగ్రీవులు అగ్నిసాక్షిగా మైత్రి పాటించారు. కరచాలనము, గాఢాలింగనము ద్వారా పరస్పరం వారికి గల సంప్రీతిని వెల్లడించు కొన్నారు. అప్పుడు సుగ్రీవుడు, రామునితో "నీ స్నేహం వలన నాబంధు మిత్రులలో నాకు

అనుటను సర్వాత్మనా సార్థకం చేసాడు. అన్న రావణుని అంతిమ సంస్కారము చేయడానికి విభీషణుడు ఇష్టపడలేదు. అప్పుడు "మరణాంతాని వైరాణి"

వైరము మరణంతో అంతమవుతుంది. లోక కళ్యాణ రూపమైన మన ప్రయోజనము సిద్ధించింది. "నీకు సోదరుడైన రావణుడిప్పుడు నాకును సోదరుడే" అని చెప్పి, రాముడు రావణుని అంత్యేష్టి చేయ విభీషణుని నియోగించాడు.

రాముడు అయోధ్య చేరి, పట్టాభిషిక్తుడై ప్రజల సుఖమునే భావించుచు, లోక హితము కోరి ప్రవర్తించాడు. తన ఆచరణ ద్వారా లోకమునకు మర్యాదనేర్పి, రాముడు మర్యాదా పురుషోత్తముడయ్యాడు.

**"మర్యాదానాంచ కర్తా కారయితా చ సః"**

సుం. కా; 35స 11 శ్లో.

## స్నేహభావం

మానవునిలోని స్వార్థమును మరపించి, పరహిత చింతనను కలుగుజేసి, మానవత్వమును పాదుకొల్పేది స్నేహము.

స్నేహ శీలియైనవాడు లోకంలో ఇతరుల ఆనందం తన ఆనందంగా, ఇతరుల కష్టం తన కష్టంగా భావింపగల విశాల హృదయం అలవర్చుకొని, తోటివారికి తోడు పడగలుగుతాడు.

రాముని స్నేహప్రవృత్తిని అభివర్ణిస్తూ వాల్మీకి అయోధ్యలో అతడెప్పుడూ మిత్రులతో కలసి మెలసి వుండేవాడని సూచించాడు.

సీతా లక్ష్మణులతో కూడి, రాముడు అయోధ్య వీడి వనవాసానికి వచ్చాడని తెలిసి, గంగా తీరంలో గుహుడు సపరివారంగా స్వాగత వచనాలతో రాముని సమీపించాడు. భక్ష్య, భోజ్యాదులైన సమస్త పదార్థములు సమకూర్చి, తనతోవుండి సుఖంగా తన రాజ్యాన్ని పాలింపుమని కోరాడు. వనవాస వ్రతం పాటిస్తున్న కారణంగా రాముడవి స్వీకరింపక పోయినా, సాదరంగా గుహునితో "నిన్ను చూడడం వలననే నాకు సంతోషం కలిగిందని, అందువల్ల అతిథి సత్కారం లభించినట్లే భావిస్తున్నా"నని చెప్పి, స్నేహభావంతో ఆతనిని ఆలింగనం చేసుకొని, వచ్చిన వారందరి యోగ క్షేమాలు విచారించి, మిత్రుని కుశలాన్ని గూర్చి ప్రశ్నించాడు.



**ధర్మార్థం ధర్మ కాంక్షే చ**
**వనం వస్తు మిహా గతః ।**

అయో. కాం. 17స; 20శ్లో

ధర్మాన్ని ఉపాసించే మార్గంలో రాముడు అర్థకామములను రెండింటిని విడిచిపెట్టి దైవీగుణ సంపద ప్రోది చేసుకొన్నాడు.

రాముని అయోధ్యకు రావలసిందని భరతుడు చేసిన అభ్యర్థనను సమర్థించుచు, జాబాలి, ధర్మజ్ఞుడైన రాముని సమక్షంలో ధర్మ విరుద్ధమైన అప్రియ వచనాలు వల్లించాడు.

రాముడు, ఆ అధర్మ వచనములను ఖండించి, సత్యసమ్మతములైన ధర్మ కర్మములు పుణ్య ఫలముల నొసగి, లౌకిక–అలౌకిక సుఖముల రెండింటిని ప్రసాదిస్తాయని వివరించాడు.

వేదములు, శిష్టాచారము కూడ సత్సాంగత్యమును, అహింసను, తపోదాన యజ్ఞాదులను ఆచరించి, నిర్మలమైన మనస్సు పెంపొందించుకొనవలెనని ప్రబోధించుచున్నవి. వేదములు పరమేశ్వరుని సత్య స్వరూపునిగా వర్ణించుచున్నవి. సకల కర్మలకు సత్యమే ఆధారము. ఋషులు, దేవతలు సత్యమునే మహత్తరమైన ధర్మముగా భావించారు. రాముని ప్రతిజ్ఞా పాలనమే ధర్మము.

కుల గురువగు వశిష్ఠుడు "నా మాట విని నీవు అయోధ్యకు వచ్చి రాజ్యమేలు"మని రాముని ఆదేశించాడు. అయితే "తల్లి దండ్రుల మాటకు భంగము ఏర్పడకుండా అది సాధింపబడాలి. కనుక అది ఇచట పొసగదు. కాని పక్షంలో తండ్రి ఆజ్ఞతోపాటు, కైక కిచ్చిన తన మాట కూడ పొరపాటయి పోతుంద"ని రాముడు వివరించాడు.

సాధుమునిజన రక్షణం తన కర్తవ్యంగా భావించిన రాముడు దండకారణ్య వాసులగు మునులకు అభయమొసగి "బొందిలో ప్రాణమున్నంత వరకు నేను వారికిచ్చిన మాట తప్పబోన"నని చెప్పి తనకు సత్యము నందు గల పరమ నిష్ఠను వెల్లడించాడు. కపటోపాయంతో రావణుడు సీత నపహరించు కొని పోయే సందర్భంలో ఆ రాక్షసుడితో పోరాడి క్షతగాత్రుడై నేలపై కుప్పకూలి ఉన్న జటాయువును చూచి, ఆతని వలన రావణుని దౌష్ట్యమును విని, తన

నిమిత్తంగా ఆతడు అసువులు బాసినందుకు విచారించాడు. స్వయముగా జటాయువునకు దహనాది సంస్కారములు నిర్వర్తించి, ఆతనికి ఉత్తమ లోక ప్రాప్తి కలుగవలెనని ఆకాంక్షించాడు. ఆ సందర్భమున లక్ష్మణునితో "ఈతడు, తండ్రి దశరథ మహారాజు వలె పూజనీయుడు, మాన్యుడు"అని చెప్పి సంభావించి కృతజ్ఞతా పూర్వకమైన ధర్మాన్ని ఆచరించాడు.

**"గచ్ఛలోకాన నుత్తమున్"**

సోదరుడు బ్రతికి ఉండగా ఆతని భార్యను అపహరించిన దుర్వృత్తుడు వాలి. అందుకు మరణ దండనమే తగిన శిక్ష. వాలి వధ తాను స్వార్థ బుద్ధితోగాక ధర్మ రక్షణకు మాత్రమే చేస్తున్నానని తెలియజేస్తూ రాముడు సుగ్రీవునితో "పాపాత్ముడు, చారిత్ర్య దూషకుడు, అయిన వాలి నా కంట పడనంత వరకే జీవింపగలడని ప్రతిజ్ఞ చేశాడు. దుష్టశిక్షణ, శిష్ట రక్షణ ధర్మప్రతిష్ఠలో భాగమని నిరూపించాడు.

**"వాలీ చారిత్ర దూషకః"**

ఒకే పోలికలు గల వాలి, సుగ్రీవులలో వాలిని గుర్తించలేక ఉపేక్షా భావంతో నున్న రాముని ఉద్దేశించి దెబ్బలు తిని అలసిపోయిన సుగ్రీవుడు రాముని "ఉపేక్షకు కారణమేమ"ని అడిగాడు. "ఈసారి ఏదైనా గుర్తు ధరించి యుద్ధానికి వెళ్ళితే దానిని బట్టి వాలిని సంహరిస్తానని" చెప్పాడు రాముడు.



"ఇంతకు ముందెన్నడు, ఎట్టి కష్టంలోను నేను అబద్ధమాడలేదు, మరి ఇంకెన్నడు నేను అనృత దోషానికి పాల్పడబోను" అని తన సత్య నిష్ఠను వక్కాణించాడు. సత్యభాషణం, కూడా ధర్మ నిరతియేయని తెలియజేశాడు.



సీతాన్వేషణకై బయలుదేరి సీతా సందేశమును గొని వచ్చిన హనుమంతుని బల, పరాక్రమ, బుద్ధి వైభవములను ప్రశంసిస్తూ రాముడు "లోకంలో దుర్లభమై, ఇతరులకు ఊహింపరాని మహత్కార్యాన్ని సాధించాడ"ని "ఆతని వలన నేడు తాను, మహాబలుడైన లక్ష్మణుడు, మరి తక్కిన రఘు వంశము ఆపదలపాలు కాకుండా రక్షింపబడినామని" సంతుష్ట హృదయుడై పలికి, ఆ సమయంలో తగిన ప్రత్యుపకారం చేయటానికి వీలులేక సర్వస్వభూతమైన తన పరిష్వంగాన్ని (కౌగిలి) ఇచ్చి గౌరవించాడు. అప్పటికి అదే ధర్మమని సూచించాడు.

లంకను, బంధువులను, మిత్రులను, ధనమును ఇంక సర్వమును త్యజించి రాముని శరణువేడ వచ్చిన విభీషణుని జూచి సుగ్రీవాది వానర వీరులందరు "ఆతడు శత్రువగు రావణుని తమ్ముడు. కావున మనము ఆతనిని చేరదీయుటకు ఆదరించుటకు వీలులేదని" తమ అభిప్రాయం రామునకు నివేదించారు. అందుకు "మిత్రభావంతో నావద్దకు వచ్చిన వానిని నేనెన్నడును విడువను" అంటూ రాముడు శరణాగత రక్షణరూపమైన ధర్మమును ఉగ్గడించాడు.

**"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కదాచన।"**

ఆ వచ్చినవాడు విభీషణుడైనా లేక రావణుడైనా సరే, ఆతనికి నేనభయమిచ్చాను, ఆదరంగా తోడ్కొని రమ్మని సుగ్రీవుని ఆదేశించాడు.

రణరంగములో రథము విరిగిపోయి, నిరాయుధుడై నిస్సహాయ స్థితిలో నిలువునా నీరై, దిక్కుతోచక నేలపై నిలబడి ఉన్న రావణుని జూచి "నీవు నేడు బాగా యుద్ధం చేయటం వలన ఎంతో అలసిపోయావు. లంకను చేరి, విశ్రాంతి తీసుకుని రేవు ఉదయం రథమధిరోహించి, ధనుర్బాణములు ధరించి రమ్మ"ని చెప్పి, చంపదగిన యట్టి శత్రువుచేత చిక్కిన యంతనే వాని మృత్యుముఖాన బడద్రోయక రాముడు యుద్ధ ధర్మమును పాటించి, అప్పటికి రావణుని విడిచిపెట్టి మరునాడు ధర్మ యుద్ధమున జయించి మహావీర పదవి నధిష్ఠించాడు.

రాముడు తాను స్వయంగా ధర్మము ఆచరించుటయే కాదు, తన అనుయాయులైన వారిచేత కూడా ధర్మాన్ని ఆచరింపచేసి

**"రక్షితాస్వస్యధర్మస్య, స్వజనస్యచరక్షితా"**
**"రామో విగ్రహవాన్ ధర్మః"**

(అర. కాం. 37స; 139శ్లో.)



రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

డాక్టర్ తూములూరు శ్రీదక్షిణామూర్తి శాస్త్రి M.A. Ph.D

## శాస్త్రిగారి ఇతర రచనలు - ప్రచురణలు

## ముద్రితములు

1. శ్రీ రామకథా2మృతము - సమగ్ర సమీక్ష ఆంధ్రా యూనివర్సిటీ వారిచే *Ph.D.* పొందిన పరిశోధన నిబంధము.
2. రామాయణం-సమాజ దర్పణం 1వ భాగము
3. రామాయణం-సమాజ దర్పణం 2వ భాగము
4. శ్రీరామ వాణి
5. వాల్మీకి వాణి
6. హనుమద్వాణి
7. పావనీ శతకము
8. మహాభారత పారిజాతము (సంకలనము)

శ్రీలలితాసహస్రనామ వివరణము (అముద్రితము)

9. మాటలంటే మాటలా ?
10. ముసునూరివారి వంశ చరిత్ర
11. తెలుగు వ్యాకరణము
12. భావదేవశతకము
13. శ్రీ వీరాంజనేయ శతకము
14. శ్రీ సత్యనారాయణ శతకము
15. శ్రీ కపోతేశ్వర శతకము
16. శ్రీ రాజరాజేశ్వరీ శతకము
17. శ్రీవిష్ణు సహస్రనామ స్తోత్రము ప్రతిపదార్థసహితము
18. శ్రీ త్రికూటేశ్వర త్రిశతి

# శ్రీరామ వాణి



రచయిత :

భాషాప్రవీణ, విద్యాప్రవీణ

## డాక్టర్, తూములూరు శ్రీదక్షిణామూర్తిశాస్త్రి

ఎమ్.ఏ., పిహెచ్.డి.